# నొప్పి డాక్టరు, సముద్రపు దొంగలు



# నొప్పి డాక్టరు,

# సముద్రపు దొంగలు



నొప్పి డాక్టరు తన జంతువులతో ఆఫ్రికా నుంచి తిరిగి వస్తున్నాడు. ఓడ మీద తోపుడు-లాగుడు పహరా కాస్తోంది. ‘‘నాకు ముందు వైపు ఎటువంటి ప్రమాదం కనపడటం లేదు,’’ అది తన ముందువైపు తలతో చూస్తూ అంది.





అప్పుడు నొప్పి డాక్టరు తన దుర్భిణిలోంచి చూశాడు. ''అది సముద్రపు దొంగల ఓడ,'' అతడు అన్నాడు. ''మనం ఇక్కడి నుంచి త్వరగా పారిపోవాలి!''



''కానీ వెనక వైపు నుంచి ఏదో ప్రమాదం పొంచి ఉన్నట్టు అనిపిస్తోంది,'' తన వెనక వైపు తలతో చూస్తూ చెప్పింది తోపుడు-లాగుడు.



మెల్ల మెల్లగా సముద్రపు దొంగల ఓడ వాళ్లకు దగ్గరకాసాగింది. సముద్రపు దొంగలు వాళ్లను చూసి పిడి బాకులు, కత్తులు, తుపాకులు ఝుళిపిస్తున్నారు.



అడ్డ స్తంభం మీద నుంచి తోపుడు-లాగుడు కిందకి దిగింది. "మనం తప్పించుకోవటం ఎలా?" రెండు తలలతో అది అడిగింది.

"మీరందరూ గట్టిగా ఊపిరి పీల్చుకోండి," నొప్పి డాక్టరు చెప్పాడు. "ఇప్పుడు తెరచాపల మీదకి గట్టిగా ఊదండి." జంతువులన్నీ అలాగే చేశాయి. అందరికంటే గట్టిగా తోపుడు-లాగుడు ఊదింది. అది తన రెండు నోళ్లతో ఊదింది. దాంతో ఓడ వేగంగా ప్రయాణించసాగింది. ఇప్పుడు సముద్రపు దొంగల ఓడ చాలా వెనకబడి పోయింది.



కొంచెం సేపటికి నొప్పి డాక్టరు, అతని జంతువులు కొన్ని దీవుల వద్దకు చేరుకున్నారు. కిలకిలారావాలతో కొన్ని పిట్టలు వాళ్లకి ఎదురొచ్చాయి.

"అరె! మనం కానరీ దీవులకు వచ్చినట్టున్నాం. నాకు కానరీ పక్షుల పాటలు వినపడుతున్నాయి," అన్నాడు నొప్పి డాక్టరు. తమ ఓడను ఒక అందమైన రేవులోకి చేర్చాడు.



అప్పుడే ఒక చిన్న, నల్ల ఎలక పరిగెత్తుకుంటూ నొప్పి డాక్టరు దగ్గరకి వచ్చింది. "నా మాట వినండి, నొప్పి డాక్టరు గారు," ఎలక అంది. "ఇది మంచి ఓడ కాదు. మీకు ప్రమాదం పొంచి ఉంది. ఇది మునిగిపోతుంది."

"నీకెలా తెలుసు?" నొప్పి డాక్టరు అడిగాడు.



"ఎలకలకి ఈ విషయం ఎప్పుడూ తెలుస్తుంది," ఎలక చెప్పింది. "మీ కాలు తిమ్మిరి ఎక్కినప్పుడు లాగానే ఇటువంటి సమయాల్లో మా తోకల చివర్లు జిల్‌మంటాయి.

ఈ రాత్రికి ఈ ఓడ సముద్రం అడుగుకి మునిగిపోతుందని మా తోకలు ఇప్పుడు చెబుతున్నాయి!"





"ఎలక సోదరుల్లారా, రండి," ఆ ఎలక
అరిచింది. "ఈ ఓడనుంచి పారిపోండి, లేకపోతే
మీరంతా మునిగిపోతారు!" అన్నివైపుల
నుంచి ఎలకలు పరిగెత్తుకుంటూ వచ్చాయి.
ఓడనుంచి దూకేసి అవి వెళ్లిపోయాయి.
"ముందుగానే హెచ్చరించినందుకు
ధన్యవాదాలు," నొప్పి డాక్టరు అరిచాడు.



నొప్పి డాక్టరు, అతని జంతువులు కిందకి దిగారు. కానరీ పక్షులు వాళ్లకి దారి చూపించాయి.

వాళ్లందరూ ఉడికిపోయి, అలసి పోయున్నారు, దాహంగా కూడా ఉన్నారు.



మంచి నీళ్ల కోసం వాళ్లు బకెట్లు తీసుకెళ్లారు.

వాళ్లని అందమైన చెరువు దగ్గరకి కానరీ పక్షులు తీసుకెళ్లాయి, నీళ్లు తేటగా, చల్లగా ఉన్నాయి. వాళ్లంతా అక్కడ ఈతకొట్టారు, ఆటలాడారు.

నొప్పి డాక్టరు స్నానం చేశాడు. లాగుడు-తోపుడు నీళ్లు తెగ తాగింది. సంతోషంతో డాబ్-డాబ్ బాతు అరిచింది.



ఆ తరువాత కానరీ పక్షులు వాళ్లని అందమైన ప్రదేశానికి తీసుకుని వెళ్లి చక్కని పాటలతో అలరించసాగాయి. అంతలో అకస్మాత్తుగా సముద్ర తీరం నుంచి టూ-టూ గుడ్లగూబ వచ్చింది.

"డాక్టర్," అది చెప్పింది, "మీరు త్వరగా రావాలి!"



"మన ఓడ మునిగిపోయిందా?" నొప్పి డాక్టరు బద్దకంగా అడిగారు.

"ఓడ మునగలేదు," టూ-టూ చెప్పింది. "కానీ సముద్రపు దొంగలు రేవులోకి వచ్చారు! మీరు వచ్చి చూడండి!"



అందరూ కొండ అంచు వద్దకు పరిగెత్తారు.
అక్కడి నుంచి సముద్ర తీరాన్ని చూశారు.
వాళ్లకి సముద్రపు దొంగల నల్లటి ఓడ
కనిపించింది! నొప్పి డాక్టరు ఓడ పక్కనే అది
ఆగి ఉంది.
"మనం కిందకి వెళ్లాలి," నొప్పి డాక్టరు
అన్నారు. "ఆ దొంగలు ఏమి చేస్తున్నారో
చూడాలి."



ఎగుడు, దిగుడుగా ఉన్న సన్నటి దారి
మీద వాళ్లు పరిగెత్తారు. సాధ్యమైనంత
వేగంగా వాళ్లు పరిగెత్తారు.



అందరికంటే ముందు లాగుడు-తోపుడు తీరానికి చేరుకుంది. పెద్ద రాయి వెనక నుంచి అది చూసింది. "దొంగలు మన ఓడ మీద ఉన్నారు!" అది చెప్పింది. "మన సామాను దొంగిలించాలని చూస్తున్నారు."

"మన పాత ఓడను వాళ్లను తీసుకోనిద్దాం," నొప్పి డాక్టరు చెప్పాడు. "నాకొక ఉపాయం తట్టింది."





“మనం వాళ్ల పెద్ద ఓడ ఎక్కి
పారిపోదాం!” నొప్పి డాక్టరు
అన్నాడు.
“మీరంతా నిశ్శబ్దంగా ఉండాలి.
మన సంగతి దొంగలకి
తెలియకూడదు.”



చప్పుడు చెయ్యకుండా జిప్ కుక్క
లంగరు ఎత్తింది. డాబ్-డాబ్ బాతు,
గబ్-గబ్ పంది చప్పుడు
చెయ్యకుండా తెర చాపలు
ఎత్తాయి. నొప్పి డాక్టరు చుక్కాని
దగ్గర ఉన్నాడు.

అంతలో అనుకోని
ఘటన ఒకటి జరిగింది...


లాగుడు-తోపుడికి
తుమ్ము వచ్చింది!



సముద్రపు దొంగలకు ఆ తుమ్ము వినిపించింది!
ఏం జరుగుతోందో చూడటానికి దొంగలు ఓడ అంచుకు వచ్చారు.

తమ పెద్ద, నల్లని ఓడ చుక్కాని దగ్గర నొప్పి డాక్టరు ఉండటం దొంగల నాయకుడు బెన్ అలీ చూశాడు.
“వాళ్లు మన ఓడను దొంగలిస్తున్నారు!” అతడు అరిచాడు. “వాళ్లని ఆపండి, మిత్రులారా!”



వెంటనే దొంగలు పెద్ద పెద్ద తాళ్లు పట్టుకుని
చిన్న ఓడ మీద నుంచి పెద్ద ఓడ మీదకి
దూకారు.
తమ తుపాకులు, పిడి బాకులు, కత్తులు
ఝుళిపించారు.

"మా పెద్ద ఓడ తీసుకుని పారిపోదామని
అనుకున్నావా?
నేను చెప్పేది విను! నీ డబ్బులన్నీ ఇచ్చెయ్,
లేకపోతే నిన్ను సముద్రంలోకి తోసేస్తాను,"
అంటూ బెస్ అలీ అరిచాడు.

అప్పుడు బెస్ అలీ కళ్లు డాబ్-డాబ్ మీద, గబ్-గబ్ మీద పడ్డాయి. "ఇవేమిటి?" అతడు అరిచాడు. "బలిసిన బాతు, బలిసిన పంది! మిత్రులారా వీటిని పట్టుకోండి. రాత్రికి పంది సియ్యలు, బాతు వేపుడు తిందాం."

అది విన్న డాబ్-డాబ్, గబ్-గబ్ భయంతో వణికిపోయాయి. "ఈ దుష్టులు మమ్మల్ని తినకుండా కాపాడు!" అని నొప్పి డాక్టరుని వేడుకున్నాయి.





"చూడు, బెస్ అలీ," నొప్పి డాక్టరు చెప్పాడు. "నీకు కావలసింది మా డబ్బే కదా. అది తీసేసుకో!

అదంతా మా చిన్న ఓడలో ఉంది. పెట్టె నిండా బంగారం అక్కడ ఉంది."



అప్పుడు టూ-టూ డాక్టరు చెవిలో గుసగుసలాడింది, "ఈ దొంగలను ఎలాగైనా మన ఓడ మీదకి పంపించు. ఆ ఓడ త్వరలోనే మునిగిపోతుంది. దానితోపాటు ఈ దొంగలు కూడా సముద్రంలో మునిగిపోతారు."

"మంచి ఆలోచన!" నొప్పి డాక్టరు గుసగుసగా బదులిచ్చాడు. "నేను ప్రయత్నించి చూస్తాను."



“ఆ పాత ఓడ మీదకి పదండి, మిత్రులారా!
అక్కడ పెట్టె నిండా బంగారం ఉంది,” అంటూ
బెస్ అలీ తోటి దొంగలకు చెప్పాడు.

అది విన్న దొంగలు సంతోషంతో అరిచారు.
వాళ్లు తాళ్లు పట్టుకుని ఊగి పాత ఓడ మీదకి
తిరిగి చేరుకున్నారు.

నొప్పి డాక్టరి ఓడంతా దొంగలు గాలించారు. బంగారం కోసం వాళ్లు అన్ని చోట్లా వెదికారు.

అంతలో అకస్మాత్తుగా ఒకటి జరిగింది.
డెక్కు వైపుకి అలీ చూశాడు. అది కారుతోంది. నీళ్లు గాలిలోకి చిమ్ముతున్నాయి!



రాను, రాను నీళ్లు కారటం ఎక్కువయ్యింది. సముద్రం నీళ్లు పైకి లేచి నొప్పి డాక్టరి పాత ఓడ మెల్లగా మునిగిపోసాగింది.

నొప్పి డాక్టరు, అతని జంతువులు ఇదంతా చూస్తూ ఉన్నారు. "భలే!" జిప్ మొరిగింది. "ఎలక చెప్పినట్లే ఆ ఓడ మునిగిపోతోంది."





బెస్ అలీ, అతడి తోటి సముద్రపు
దొంగలు సముద్రంలోకి దూకేశారు.
పాత ఓడ సముద్రంలో
మునిగిపోయింది.
అలా మునిగేటప్పుడు అది గుడ
గుడమంటూ భయంకరమైన శబ్దం
చేసింది.

అయితే సముద్రపు దొంగలందరికీ ఈత బాగా వచ్చు. వాళ్ల చేతుల్లో ఇంకా తుపాకులు, కత్తులు, పిడి బాకులూ ఉన్నాయి.

వాళ్లు నొప్పి డాక్టరు, అతని జంతువుల వైపు ఈదుతూ వస్తున్నారు.

“మిమ్మల్ని వదిలిపెట్టం!”

ఈదుతూ అరిచాడు బెన్ అలీ.



అంతలో సముద్రపు దొంగలు భయంతో

అరవసాగారు.

వాళ్లని ఎవరో తరుముతున్నారు.

"చూసుకోండి!" ఒక దొంగ అరిచాడు.

"పెద్ద సొరచేప!"

"చాలా సొరచేపలు!"

బెస్ అలీ అరిచాడు.

"కాపాడండి!

సొరచేపలు మమ్మల్ని

తరుముతున్నాయి!"



వాటిల్లో ఒక సొరచేప నీళ్లలోంచి తల బయట పెట్టింది. "నొప్పి డాక్టరు గారు, మీరు చాలా మంచివాళ్లు. సొరచేపలతో సహా జంతువులన్నింటితో మీరు స్నేహంగా ఉంటారు. కాబట్టి, మేం మీ మిత్రులం. కానీ, ఈ సముద్రపు దొంగలు చాలా చెడ్డవాళ్లు. ఒక్కొక్కరిగా వీళ్లని మేం తినేస్తాం. ఇక వీళ్లు మిమ్మల్ని ఇబ్బందిపెట్టలేరు."



"మాపై జాలి చూపండి," బెస్ అలీ వేడుకున్నాడు. "ఈ సొరచేపల నుంచి మమ్మల్ని కాపాడండి! మీరు ఏది చెబితే అది చేస్తాం!"

"సరే," నొప్పి డాక్టరు అన్నాడు. "ఇక మీరు సముద్రపు దొంగలుగా ఉండటానికి లేదు. మీరు నేల మీదే ఉండాలి. కానరీ పక్షులకు ఆహారం సాగుచెయ్యాలి."





"పక్షులకు మేత!" సముద్రపు దొంగలు ఏడ్చారు. "చివరికి మాకు ఈ గతి పట్టింది!"





అయితే సముద్రపు
దొంగలకు దారి లేదు.
వాళ్లు ఈదుకుంటూ తీరాన్ని
చేరి ఒడ్డుకి ఎక్కారు.

తరువాత నొప్పి డాక్టరు, అతని జంతువులు
సముద్రపు దొంగల నల్లని, పెద్ద ఓడలో
ప్రయాణమయ్యారు. కానరీ పక్షులు
ఎగురుతూ నొప్పి డాక్టరుకి వీడ్కోలు
పలికాయి. సొరచేపలు రేవులోంచి బయటకు
దారితీశాయి.

తరువాత నొప్పి డాక్టరు, అతని
జంతువులు ఓడలో కిందకి వెళ్లారు.
"ఇది చాలా బాగుంది!" టూ-టూ
అరిచింది. కింద మందపాటి, మెత్తటి
తివాచీలు పరిచి ఉన్నాయి.

పట్టు దుప్పట్లతో అక్కడ మంచాలు
ఉన్నాయి. పెట్టెల నిండా డబ్బులు,
ఆభరణాలు ఉన్నాయి. తినటానికి ఎన్నో
రుచికరమైన పదార్థాలు ఉన్నాయి!



తిన్న తరువాత నొప్పి డాక్టరు, అతని జంతువులు ఓడ డెక్కు మీదకి వెళ్లారు.

తోపుడు-లాగుడు అడ్డ స్తంభం మీదకి ఎక్కింది.

"ముందువైపు ఎటువంటి ప్రమాదం లేదు," తన ముందువైపు తలతో చెప్పింది.

"వెనకవైపు కూడా ఎటువంటి ప్రమాదమూ లేదు," అది తన వెనకవైపు తలతో చెప్పింది.

"అయితే మనం ఇంగ్లాండుకి క్షేమంగా చేరుకుంటాం," నొప్పి డాక్టరు చెప్పాడు.

వాళ్లు అలాగే చేరుకున్నారు.



# అయిపోయింది